## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరవిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీకృష్ణ

# పవిత్రత.

पवित्रता·

పరాశరస్మృతిలో పవిత్రము లనునవి నాలుగు విధము లని చెప్పబడియున్నది.

1. శుచి.
2. పూతము.
3. స్వయంశుద్ధము.
4. పవిత్రము.

శ్లో॥ వక్ష్యే తేఽతః పరం సర్వం
మేధ్యామేధ్యసముచ్చయం।

శుచి పూతం స్వయంశుద్ధం
పవిత్రం చేతి కేవలం ॥
మేధ్యం చతుర్విధం లోకే
ప్రజానాం మను రబ్రవీత్ ।
నవం వా నిర్మలం వాపి
శుచీతి ద్రవ్య ముచ్యతే
శుద్ధం పవిత్రభూతం చ
పూత మిత్యభిధీయతే।
స్వయమేవహి యద్ద్రవ్యం
కేవలం ధన్యతాం గతం॥
స్థావరం జంగమం వాపి
స్వయంశుద్ధ మితిస్మృతం।
అన్యద్రవ్యై రదూష్యం యత్
స్వయమన్యాని శోధయేత్ ॥
హవ్యకవ్యేషు పూజ్యం యత్
తత్పవిత్ర మితిస్మృతం॥

ఈవిభాగ మంతగా నసంకీర్ణముగా లేక పోయినను నేనిని పరిశీలించి చూతము.

1. శుచి.—అనగా, నూతనమైనప్రతివస్తువును, అనగా వస్త్రములు, నూతనముగ తయారైన గృహోపకరణములు, మాలిన్యము లేని ప్రతివస్తువును, సర్వధాన్యములు, ఆభరణములు, కాయగూరలు నెయ్యిన్నవి.

2. పూతము.—అనగా శుభ్రపరిచబడిన పదార్థములు. కాలుష్యము లేక వడకట్టబడిన లేదా వస్త్రగాళితము చేయబడిన పదార్థములు. మరియు వేరొక వస్తువుచేత పవిత్రముగ చేయబడిన విన్నియును.

3. స్వయంశుద్ధము.— అనగా అన్నివిధములయిన ఆసనములు, శయనములు, యానములు, ఆయుధములు, యజ్ఞపాత్రలు, భూగతోదకములు, మరియు పంచభూతములు, స్త్రీముఖము (సంభోగ

కాలమందు), పితృకార్యకాలము, యుద్ధకాలము, గోవు, మేక, యేనుగు, గుఱ్ఱము, ఛత్రము, దోమలు, మిడుతలు, దర్భలు, పతివ్రత, ధర్మపరులగు ప్రభువులు, నిత్యసంతుష్టులగు బ్రాహ్మణులు, వృక్షపాషాణాదులు.

4. పవిత్రము:— అనగా అన్యద్రవ్యసంపర్కమువలన దోషము లేనిదియు, దోషవస్తువును బాగు చేయునదియు, దేవపితృకార్యములకు నుపయోగించునదియు నని చెప్పబడియున్నది.

పరాశరస్మృతి-చతుర్వింశతిమతం.

శ్లో॥ ఆమం మాంసం ఘృతం క్షౌద్రం
స్నేహా శ్చ ఫలసంభవాః।
అంత్యభాండస్థితా హ్యేతే
నిష్క్రాంతా శ్శుచయః స్మృతాః॥

కూరగాయలు, మాంసము, నెయ్యి, తేనె, అన్ని విధములయిన నూనెలు, ఫలములు, యివి అంత్య జాతుల పెట్టెలు మొదలయిన వానిలోనుండి వచ్చి నను తీసి యితరపాత్రలలో నుంచిన శుద్ధమయిన వగుచున్నవి అని యర్థము.

పైని చెప్పబడిన స్మృతినిబట్టియు, మరికొన్ని గ్రంథములనుబట్టియు నీక్రింద చెప్పబడినవి పవిత్ర ములుగ మనము గ్రహింపవలయును.

నదీతటాక కూపోదకములు, పాలు, దానిసంబం ధము లగు నెయ్యి, మొదలగునవి, ఆహితాగ్ని, రాజు, అర్చకుడు, ఋషి, సన్యాసి, మఠాధిపతి, జియ్యంగారు మొదలగువారు, గోవు,వృషభము,గజ ము, అశ్వము, శుకము, అన్నివిధములగు గింజలు, వానిచముడు, కాయగూరలు, ఫలములు. మహా ఘటపటాదులు, పుష్పములు, దుంపలు, మరియు

దోహదముచేత పవిత్రతను జెందినవి. యేవి యన అన్ని విధములగు మందులు, లేహ్యములు, ఘృతములు, కషాయములు మొదలగునవి. ఇవి వంటల పూర్వకముగ తయారయినను అవి చెడకుండునటుల చేయబడుటచేత పవిత్రములుగ నెంచబడినవి. అటులే ఊరుగాయలు, మురబ్బాలు మొదలగునవియు అందలిపదార్థములు చెడకుండనుండునటులు చేయబడుటనుబట్టి పవిత్రము లయినవి. ఔషధముల తినుటకు దూష్యములగు చేతికిట్లు, మామా ళయిలో నటులే మాంసాదులసారములు పడినను ఆరోగ్యమునకు అవి ముఖ్యములయినందున దూష్యములుగ నెంచబడలేదు.

ఒకశూద్రుడు, లేదా అంతకు తక్కువగ నెంచబడువానియింటనయిన అతనియింటనున్న త్రాగు నీళ్లలో నొక మజ్జిగచుక్కగాని, పంచదారతునుక

గాని, వేయగానే ఆసీళ్లను బ్రాహ్మణు డయినను త్రాగవచ్చును.

గంగాదిమహానదుల జలములు బురదలేనికాల ములో తీయబడినయెడల చాలాకాలము చెడకుండ నుండును. ఇప్పటికిని మానగరిలో ముప్పదిసంవత్స రములనాటి గంగాజలము రాగిగిండీలో నిలువ యున్నది.

మరియు పరాశరస్మృతియం దిట్లున్నది.

శ్లో॥ దేశభంగే ప్రవాసేవా
వ్యాధిషు వ్యసనే ష్వపి।
రక్షేదేవ స్వ మాత్మానం
పశ్చా ద్ధర్మం సమాచరేత్ ॥

యేనకేనచ ధర్మేణ
మృదునా దారుణేన వా।

ఉద్ధరేద్దీన మాత్మానం
సమర్థో ధర్మ మాచరేత్ ॥
ఆపత్కాలే సముత్తీర్ణే
శౌచాచారం తు చింతయేత్ ।
శుద్ధిం సముద్ధరేత్పశ్చాత్
స్వస్థోధర్మం సమాచరేత్ ॥

దేశోపద్రవములు కలిగినపుడును, ప్రయాణ ములయందును, రోగములయందును, ఆపదల యందును, ఎట్లయినను దేహసంరక్షణమాత్రము చేసికోవలెను. స్వస్థతకలిగినపయిని శాస్త్రోక్తధర్మములను చేయవలెను. మృదువయిన సాధనముచే గాని కఠినమయిన సాధనముచేగాని ఏదోయొక యుపాయముచేత రోగాదులచే దీనమయిన శరీర మును సంరక్షించుకోవలెను. సమర్థత కలిగినపుడు శాస్త్రోక్తధర్మము నాచరింపవచ్చును. ఆపత్కా లము కడచినపిదప పరిశుద్ధమయిన యాచారమును

గురించి యోజించవలెను. అనంతరమందుపరిశుద్ధిని కాపాడుకోవలెను. స్వస్థత కలిగినమీద శాస్త్రీయమయిన ధర్మము నాచరింపవలెను.

ఇంతియే కాక రోగికి స్నానప్రసక్తి కలిగినపుడు ఇట్లు చెప్పబడియున్నది.

శ్లో॥ ఆతురే స్నాన ఉత్పన్నే
దశకృత్వో హ్యనాతురః।
స్నాత్వా స్నాత్వా స్పృశేదేనం
తతశ్శుద్ధ్యేత్స ఆతురః॥

అనగా జ్వరాదిపీడితునికి ఆశౌచశుద్ధి మొదలగువానివలన స్నానము చేయవలసి వచ్చినపుడు రోగములేని యింకొకడు పదిసారులు స్నానము చేయుచు ప్రతిస్నానము చేసినపిదపను ఆరోగిని స్పృశించినయెడల పరిశుద్ధుడగును.

ఇంకను సముద్రయానముచేసిన వారి విషయములో, మను, పరాశరస్మృతులలో నిట్లు చెప్పబడి యున్నది.

శ్లో॥ అగారదాహీ గరదః
కుండాశీ సోమవిక్రయీ।
సముద్రయాయీ వందీచ।
తైలికః కూటకారకః॥

సముద్రయానము చేసినవారికి,గృహదాహకుడు మొదలగు మరికొందరితోపాటు పితృకర్మయందు భోక్తగా నుంచుకొనుట కర్హతలేదని మాత్రము చెప్పబడియున్నది. కాని దేశక్షేమము, విద్యాభ్యాసము, రాజకీయకార్యములు, నాగరకతాభివృద్ధి, దేహారోగ్యము వీనికొరకు సముద్రయానము చేసినవారికి దోషము లేదనుటయే యుక్తముగా కనబడుచున్నది. అట్టివారలు దేశాంతరమునుండి

వచ్చిన పిదప పూర్వపు వారివారియాచారములను విడువక నటించినచో వారి విషయమయి యేవిధ మయిన యాక్షేపణము పెట్టుకొన నవసరములేదు. ఈ పరాశరస్మృతికి మాధవాచార్యులవారి వ్యాఖ్య ముఖ్యము. అందునుండియే దీనిని "పరాశరమాధ వీయము" అని వాడుచుందురు.

మరియును ఇప్పటికాలముయొక్క సంఘసంస్క రణము (Social Reforms) కొరకు పైని కనబర చిన కారణములవలన మనము, ఇపుడు కొన్ని పదార్థములను పుచ్చుకొనుటకు, అంగీకరింపవచ్చు నని నా యభిప్రాయము. సోడా మొదలగు (Aerated waters) అందుల నీరు చెడకుండ చేయబడు టనుబట్టి అవి పానీయములు. టీ, కాఫీ, కోకో లోనగు వానిలో ఒక్కొక్క వస్తువువల్ల నే పవిత్ర తను గలిగించు శక్తిగల పాలు, చక్కెర, పడుటను బట్టి యవియు పానార్హములు.

పై దేశములనుండి వచ్చెడు మురబ్బాలు అన్నియు, మందులు, టిన్ డబ్బీలలో వచ్చుబిస్కతులు, భోజనీయములు. అయితే, సారాయిలు, మాంసము, చెడకుండ చేయబడుచున్నవిగదా వానినిఏల సేవింపకూడదని తోచును. నిషాచేయు పదార్థములన్నియు, మాంసములు దూష్యములు గావున వానిని అనగా సారాయిలను మాంసాదులను దూష్యములుగ గ్రహింపవలెను. మత్స్యమాంసాదులను తినువారు అట్టివానినిభుజింపవచ్చును. ఇంకను మన దేశములో అవివేకము చేత తప్పుగ నెంచబడు వానియందు తప్పును గమనింపకుండవలెను. బ్రాహ్మణుడు త్రిమతస్థులలో నెవ్వడయినను, ఏశాఖవాడయినను, వంటచేయు పదార్థములను అందరు భుజింపవలసినది. తైలపక్వముల నెవ్వడు చేసినను భుజించుటలో ఆక్షేపణ లేదు.

శుచిగల యేజాతి వానినయినను స్పృశించి నపుడు మైల యని తలంపకూడదు. మడి, మైల, అనునవి భావితములు గాని నిజములుగావు. ఏల యన మనము స్నానమును చేసికొంటిమి. శుభ్రవస్త్రములను ధరించితిమి. మనము మడితోనున్నామని తలంపకూడదు. మనముపైకి యెంతశుభ్రము ను చేసికొనినను, శరీరమునందు మన్నును, పండ్లయందు మురికిని, ఎప్పటికిని లేనివారము గాము. మరియు మన శరీరములోని రక్తమాంసములను గలిగే యుందుము. ఇంతియే గాక మూత్రపురీష ముల భాగములు లేకయుండవుఁ గావున, మడి, మైల లనునవి భావనలే గాని నిజములు గావు అని నమ్మవలెను. జనులందరు ఏకవిధముగనే జన్మమెత్తిన వారు. ఇటీవల వారివారి నడవడికలను బట్టియు వృత్తులను బట్టియు, జాతులు వేరువేరుగ నెంచ

బడినవి. అట్టివారివిషయమున మనము అంటు అను పట్టుదిలను విడువవలయును.

పూర్వకాలములో ఋషులు రాజులకడకు పోయి వారికి భోజనవాంఛ గల యడవిమృగ మాంసములను అడుగుటయు, ఆ రాజులు వేటకు బోయి ఆమృగములను సంహరించి తెచ్చి ఆ ఋషులకు ఆ మాంసములతో విందు చేయుటయు గలదు. పాండవాదులకు శూద్రులు వంటలుచేయుచున్నట్లు భారతగ్రంథములో స్పష్టముగ చెప్పబడియున్నది. పూర్వకాలములో హీనజాతులవారి విషయములో గాక బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతులలో అసూయ గాని అంటు అనెడి పట్టుదల గాని లేదు. ఇటీవలివారు వారివారికి గల యతిశయములు చూపుట ప్రధానముగ తలచి అక్కరలేని పట్టుదలలు పెట్టుకొనుచు వచ్చిరి. మరియు శంకర, రామానుజ, మధ్వాచార్యుల

కాలముల పిదప మతవైషమ్యములు హెచ్చి ఆమూడుమతములు గలవారిలో ఛాందసపు అడ్డులను పెట్టుకొనుటయేగాక ఆమువ్వురు మతస్థులలో సహా పచ్చిపట్టుదలలను పెట్టుకొనుచు హెచ్చించుచు వచ్చిరి. ఇప్పటి కాలానుకూల్యమునుబట్టి వానిని సుతరాము విడుచుచు పైని చెప్పినప్రకారము సంఘాభివృద్ధికొరకు అవివేకపుపట్టుదలలను మానుకొనుటకు మనము ప్రయత్నింపగోరుచున్నాను.

శ్రీ కృ ష్ణ దా సు డు.

---